సంపుటము 5] సెప్టెంబరు, 1918 [సంచిక 3



# బాలమిత్ర

## మానవుని మూడు విధులు

దేవునియెడల:—సృష్టింపబడినది సృష్టికర్తయెడల ఎట్టి భక్తిమర్యాదలతో నుండవలెనో అట్టి సభక్తిమర్యాదలతో తప్ప మరేవిధముగా నైనను దేవుని పరిశుద్ధనామ ముచ్చరింపరాదు. ఈ లోకమునందు లోబడుటకు ఆయుసకంబె నిజమైనట్టియు తగినట్టియు మరియెవరును లేరని గ్రహించుట.

2. మానవునియెడల:—ఇతరులు నీకేమి చేయవలెనని నీవు కోరెదవో నీవును వారి కాలాగు చేయుము.

3. నీయెడల:—నీ తృప్తినిగాని పనినిగాని చేయుటకు వీలుగా నటులజేయు అమితానుభవమునుండి తొలగిపోవుట.

# కప్ప పాట



బేహాగ్ రాగము—రూపక తాళము

త్రిప్పలందు వాననీరు - తీరుజాడు డక్కరో .
గుప్పుగుప్పు గుప్పటంచు - గుప్పళించె కప్పలు

1. చిట్టిపట్టి చిటపటంచు - చిట్టికప్ప లెన్నియో
మిట్టిపడుచు నుండెవాన - చిటపట చిటగురియగా
2. దోమలిందు నందునాడ - నేమరించి గుప్పునన్
గుప్పునను చప్పరించె - గొప్పకప్ప లదుసులో
3. ఎక్కడోనుం డిందుజేరె - నక్కరో యీకప్పలు
బొక్కలందు నిద్రపోవు - పక్కిదెలిసె నహాహా
4. గ్రుడ్డువెడల బెట్టియుదే - గోంప్రుకప్ప గాండ్రవెన్
గడ్డిచోట్ల చిన్నకప్ప - లడ్డులేక నెగిరెన్.

*

# "అడుగుడి మీకు దొరకును"



ఒక వూరిలో దైవభక్తురాలైన బీదవిధవ ఒకతె యుండెను. ఆమెకు ముగ్గురు కుమార్తెలు ఒక కుమారుడుండెను. పెద్దకుమార్తె వయస్సు 10 సంవత్సరములు. ఈ తల్లికి బిడ్డలను బెంచుట చాల కష్టముగ నుండెను. ఆమె ప్రతిదినము కుట్టుకుట్టి బిడ్డలను బోషించుచుండునది. తన కుమారునికి 9 సంవత్సరముల వయస్సు రాగానే యతనిని ఒక దొరగారి క్రింద ఉత్తరముల నందించు వానినిగా నియమించెను. ఇతడు తపాలాఫీసునుండి జాబులను దెచ్చుచు ఒకనాడు ఆ వుత్తరముల నెట్లు వ్రాయవలెనో యేమి వ్రాయవలయునో

పైవిలాసముమీద నేమి వ్రాయవలెనో యడిగితెలిసికొని తాను జాబును వ్రాయ మొదలుబెట్టెను.

ఇతడు తనకున్న కష్టముల నన్నిటిని ఆ జాబులో వ్రాసి పైవిలాసముమీద 'పరలోకమందున్న మా తండ్రి కిచ్చేది' అని వ్రాసెను. తపాలాఫీసువారి కిది యెవ్వరి కిచ్చుటకుం దోచక నొక మిషనెరిగారి కిచ్చెను. అప్పుడా మిషనెరిగారు ఆ యుత్తరము నొక సభలోనికి దీసికొనివచ్చెను. దానికీ పిల్ల వాడు కూడ తన దొరగారితో వచ్చెను. మిషనెరిగారా యుత్తరము నచ్చట జదువగా నందరు కన్నీరు విడిచిరి. అప్పుడా పిల్లవాడు నేనే ఆ జాబును వ్రాసితిని ఎందుకనగా నాకీ వస్తువుల నన్నిటిని ఈ లోకములో నిచ్చువారు లేరు గాన మాయమ్మ నేర్పినట్లు నేను పరలోకమందున్న నాతండ్రి నడిగితి ననెను.

అప్పుడా సభలోనుండి ఒక దొరసానిగారు పరిశుద్ధాత్మచే ప్రేరేపింపబడి ఆ పిల్లవానిని వాని కుటుంబమును నేను పోషించెదనని ఒప్పుకొని అప్పటినుండి వారిని పోషించి వారికి దగిన సాహాయ్యమిచ్చెను.

చూడుడి! ఆ పిల్లవాని విశ్వాసము అతడు ప్రభువును నమ్మకముతో నడిగెను. ప్రభువతని మొర నాలకించెను. మన మును ప్రభువు నడిగిన ఆయన మనకిచ్చును.

# బైబిలు పిల్లలు



## సాలీడును బట్టి నేర్చుకొనవలసిన పాఠములు

బాలమిత్రులారా! మీలో నెంతమందికి సాలీడన్న ఇష్టము? మీలో చాలమంది అది వానిగూడును ఎంత నేర్పరితనముతో అల్లునో కనిపెట్టిచూచి యుందురుగదా? ఎప్పుడైనా ఆ చిన్నపురుగు మనకెన్ని పాఠముల నేర్పునని తలంచితిరా. మనవేద గ్రంథము విప్పిచూచిన మూడుసార్లు దానిని గురించి చెప్పబడినట్లు చూడవచ్చును.

యోబు 8 అధ్యాయం 14 వచనమును చదువుడు. వేషధారియొక్క నిరీక్షణ నమ్మకములు సాలెపురుగు గూటికి

పోల్చబడియున్నవి. వేషధారియన నెవడో మీకు తెలియునా? లేనిది ఉన్నట్టుగా కనబడుటకు ప్రయత్నించువాడు వేషదారి యనబడును. సాలెపురుగు గూడుగట్టితనముఎంత? నీ వ్రే లితో ముట్టినంత మాత్రమున తెగుటలేదా? మీనిరీక్షణ ఎటు వంటిది. దీని గూటివంటిదేమో ఆలోచించుకొనుడు. మీలో నందరికి అనేక గొప్పగొప్ప నిరీక్షణలుండవచ్చును. అయితే మోక్షములోకి తప్పక వెళ్లుదునని నిరీక్షించుచున్నావా? నీ పాపములు క్షమింపబడినవని నిరీక్షించుచున్నావా? నీవు ప్రభు వైన క్రీస్తునునమ్మితేతప్ప నీ నిరీక్షణమంచి పునాదిపైన వేయ బడదు. యేసురక్తమే మీ పాపములతుడిచివేయునని 1 యోహాను 1 అధ్యాయములో వ్రాయబడినది. ఈ గొప్పనిరీక్షణ మీకు లేకున్న మీ నిరీక్షణ సాలెపురుగు గూటివంటిదని తెలిసి కొనుడు.

యెషయా 59: 5–6 చదువుడు. అధ్యాయపు ఆరంభ ములో దేవుని జనులు ఎట్లు వారి పాపములనుబట్టి దేవుని నుండి వేరుపరచబడిరో దాని గురించి చెప్పబడియున్నది. అట్టివారే తమ పాపముల దాచుటకు తమ దుష్టక్రియలను వస్త్రములను నేసికొనుచున్నారు. దేవునినుండి నిన్ను దూరపర చెడి కొంటెపనులను గురించి ఎప్పుడైనా తలంచుచున్నావా? నీ దుష్టక్రియల విషయమై పశ్చాత్తాపపడి ప్రభువుయొద్ద

క్షమాపణ నడుగుకొనుచున్నావా? లేనియెడల నీవును నీ చెడు కార్యములను దాచుటకు సాలెపురుగునకువలె వస్త్రమును నేసికొనుచున్నావు. దేవుని దృష్టియెదుట నవి దాచబడవు. సాలెపురుగు గూటిగుండా మనము దేనినైనను చూడగలుగునట్లు ప్రభువుకూడా దాచిపెట్ట ప్రయత్నించిన మన చెడుక్రియలగుండా చూడగలడు. ప్రభువు మన కొరకు చనిపోయెనుగదా? మన చెడుపనుల విషయము చింతించి మన రక్షకుని చెంతజేరి మన పాపములకు క్షమాపణపొందుదము.

మూడవపాఠ మేదో మీకు తెలియునా? ముందున్న రెండునకువలె గాక మనకు మంచి హెచ్చరికను నిరీక్షణను గలిగించునదైయున్నది. ఇంత చిన్న సాలెపురుగు రాజనగరములో నుండుట అచ్చట గూడుగట్టుట చిత్రముకాదా? మనముకూడా సాలెపురుగులవలె అల్పులమై రాజాధిరాజగు యేసుక్రీస్తు మనకొరకు సిద్ధపరచనైవెళ్లిన నగరిలోనుండుటకు స్థలము సంపాదించుకొమ్మని మనలవురి కొలుపుటలేదా. యోహాను సువార్త 14వ అధ్యాయములో ఆయన మన కొరకు స్థలము సిద్ధపరచవెళ్లుచున్నా ననియు భయపడకుడనియు ఆదరణకరమాటలు చెప్పెను. యేసుప్రభువు రాజులకు రాజని మీరు తెలిసికొని ఆయనను ప్రేమించి ఆయనయందు మీనమ్మ

కముంచితే ఆయన సిద్ధపరచుచున్న నగరములో మనకు కూడా స్థలమున్నదని తెలిసికొందము.

ఇక మీదట మీరు సాలీడునుదాని గూటిని చూచినప్పుడెల్ల నేడు నేర్చుకొనిన మూడు పాఠములను జ్ఞప్తికి తెచ్చుకొందురని నమ్ముచున్నాను.

---

## ఇష్టురాలు

ఎవరే పిల్లలారా! నాక్కాస్త తైలం తెచ్చిపెట్టరూ అని మూలుగుచు తాతగారు పక్కపైనుండి యనెను.

ఆ మాటలు వచ్చీ రాకమునుపే రాజమ్మ పరుగునబోయి పెట్టెతీసి తాతకు కావలసిన తైలము దెచ్చి "తాతా! ఇదిగో తైలము, ఎక్కడ, రాసేది, పాపము! చాలనొప్పెత్తు చున్నదా?" యని యడిగి తైలము రుద్దెను.

"లక్ష్మీ! నాకు కొంచెము కత్తెర తెచ్చి పెట్టూ" అని తల్లి యనెను.

"ఏంటే, ఇప్పుడేకూర్చున్నా, ఇక్కడ బాగావుంది, లేవ లేను. రాజీ! నూపోమ్మా, అమ్మకంటా కొంచెము కత్తెర తే."

అని లక్ష్మమ్మ యనెను. అచ్చనగాయలాడుచున్న రాజమ్మ వెంటనే వెళ్లి తల్లికి కత్తెర దెచ్చి యిచ్చెను.

"నాన్నగారు ఈ చీటిని తీసికొనిపోయి సుబ్బారావుగారికిమ్మంటున్నారు. ఎవరు బోతారు?"

"అబ్బా! నేను బోనే" అనెను లక్ష్మి.

"నేను మంచి కథచదువుకొంటున్నాను. అయినా నాన్నగారి చీటి ఇచ్చివస్తానులే. ఏదీ ఆ చీటీ?" యని రాజమ్మ దానిని తీసికొని వెళ్లెను.

"అక్కా! సెలవులకు నీ యిద్దరి పిల్లలలో నొకరిని తీసికొని వెళ్లెదను. ఎవరిని పంపగలవు? అని వారి చిన్నమ్మ అడిగెను.

"లక్షుమమ్మను తీసికొనిపో. మాకు రాజమ్మ ఉంటే చాలును. దానివలననే మాకు కాస్తనెమ్మదిగా ఉంటుంది. గాని నీవెవరిని తీసికొని వెళ్లెదవు? అని తల్లి యనెను.

"రాజమ్మనే తీసికొని వెళ్లుదును. ఆమెయే నాకు కావలెను. మరియు ఆమెకు కొంచెము విశ్రాంతియు కావలెను." అని ఆమె చెల్లెలు చెప్పి, రాజమ్మను తన యింటికి తీసికొని పోయెను. గనుక లక్షుమమ్మ యింటి యొద్దనే ఉండెను."

"ఎంత అన్యాయ మబ్బా! ఛీ, అందరికీ రాజి అంటేనే యిష్టము," అని లక్ష్మమ్మ గొణుగుకొనెను.

అందరి కెవరు సహాయము చేయుదురో వారే అందరికి కావలెను.

---

# ఒంటె నక్క కథ



ఒక నది యొడ్డున ఒక నక్క పీతలను తినుచుండెను. ఆ నది అవతల యొడ్డున చెఱకుతోట యొకటియుండెను. అప్పుడు ఒక ఒంటె వచ్చుచుండగా నక్క చూచి నీవు నన్ను నది దాటించిన మన మిద్దరము చెఱకు తోటలోనికి పోయి బాగుగా తినగలము అని చెప్పెను. అప్పుడు ఒంటె సరే యని నక్కను తనపై నెక్కించుకొని నది దాటి చెఱకు తోట

లోనికి పోయెను. అప్పుడు నక్క బాగుగా చెఱకును తినెను. తోటలో ఒంటె మేయుచుండెను. నక్క దానిని ఏలాగైన మోసముచేయవలెనని తోట బయటకు వచ్చి పెద్దగా నరచుచుండెను. అప్పుడు కాపువారు మన తోటలో ఏమో యున్నవని కఱ్ఱలు తీసికొని వచ్చి ఒంటెను బాగుగా కొట్టి వెళ్లగొట్టిరి. పిమ్మట ఒంటె నక్కతో నీవు నన్ను ఎంత మోసము చేసితివి. నన్ను తోటలోనికి పంపి నీవు బయటకు వచ్చి అరచితివనెను. అప్పుడు నక్క నేను కడుపు నిండితే ఆలాగు అరచుట నాకలవాటని చెప్పెను. మరల ఒంటె నక్కను ఎక్కించుకొని నదిలో పోవుచు నది మధ్యకుపోయి ఒంటె అటు యిటు నూగుచుండెను. నక్క ఒంటెతో నీవు ఎందు కూగుచున్నావు అని అడిగెను. అందుకు ఒంటె నా కడుపు నిండినపుడు ఆలాగున నూగుట నా అలవాటు అనిచెప్పి దానిని నీళ్లలో పడవేసెను. నక్క నీళ్లలోపడి చనిపోయెను. ఒంటె తన దారినివెళ్లిపోయెను. గనుక ఇతరులకు కీడుచేయ దలంచు వారు ఎప్పటికిన్ని బాగుపడరు.



# విత్తువానిగూర్చిన ఉపమానము

ఉపమానమనగా నేమో నీ వెఱుగుదువా? అది అంతరార్థముగల యొక కథ. యేసుప్రభువు తన శిష్యులకు అట్టి కథలు చెప్పుచుండువాడు. ఒకప్పుడు ఆయన విత్తువాని

గూర్చిన ఈ యుపమానము చెప్పెను. విత్తువాడొకడు పొలములో విత్తనములను వెదజల్ల మొదలుపెట్టెను. ఈ బొమ్మలో వాడు పొలములో గింజలు చల్లుచుండుట నీవు చూతువు. వాటిలో కొన్ని గట్టిభూమిని పడెను. వాటిని పక్షులెత్తుకొని తినుటచేత నవి మొలువలేదు. కొన్ని మోటయిన జాతి భూమిని పడెను. అవి వెంటనే మొలచెనుగాని చాలినంత మన్ను లేనందున వెంటనే యెండిపోయెను. మఱికొన్ని ముండ్లలోను, ముత్రలలోను పడెను. అక్కడవి మొలచినను ఎదుగుటకు తగిన నీలులేకపోయెను. వేఱే కొన్ని, దున్ని పదునుపరచబడిన భూమిలో పడెను. అక్కడవి మొలచి పెరిగి ఫలించెను. ఈ కథ ఉపమానము.

ఇప్పుడు దీని అర్థము చెప్పెదను.

మనము చేయవలసినదని బైబిలులో చెప్పియున్న సంగతులే విత్తనములని యేసు చెప్పెను. ఆ విత్తనములు పడిన నానావిధములైన భూములవలెనే, తాము చేయవలసిన తమ తమ విధులను వినుచున్న మనుష్యులందరు ఉన్నారు. కొందరు గట్టిభూములవలెనుండి, యోగ్యులుగా నుండుటకు, జాగ్రత పడరు. ఇతరులు జాళ్లభూమివలెనుండి కించిత్కాలము యేసు కోరినట్టు ఉండ యత్నింతురుగాని వెంటనే విసిగిపోదురు. ఇంకా కొందఱు తాము యోగ్యులై యుండవలె ననుకొం

దురు. కాని వారు ఐహిక సంబంధమైన బహు విషయనులనుగూర్చిన విచార సంతోషములవల్ల, అట్లుండలేకున్నారు నిశ్చయముగా తాము సజ్జనులై యుండ సర్వదా ప్రయత్నించువారు కొందరుగలరు. వారు చేయగలిగినంత వరకు సత్కార్యములనే చేయ సంకల్పించుచున్నారు. అట్టివారు పదును చేయబడిన ఆ మంచి భూమివంటివారు. నీవు వీరిలో నెవరివలె నుండగోరుచున్నావు?

# బాలమిత్ర టపా

ప్రియబాలమిత్రులారా!

నేను కొంతకాలమునుండి, "బాలమిత్ర" యను నీచిన్నపత్రికను చదువుచున్నందున, నాహృదయము సంతసాగరంబున మునింగినదని జెప్పుటకు సందియములేదు. ఇంతియకాక నేను చాలాకాలమునుండి ఈ పత్రికాధికారియైన శ్రీ మెకాలిఅమ్మగారిద్వారా నొక బాలమిత్రటపా వ్రాసికొనవలెనని కోరికతోయుంటిని. అయితే యిప్పుడు నాకోరిక నెరవేరినందుకు దేవునికి నిండా కృతజ్ఞతస్తుతులను చెల్లించుచున్నాను.

నేను యిప్పుడు బెజవాడబోర్డింగులో యున్నాను. మా గురువులవారైన ఘనతవహించిన శ్రీ రెవరెండు ఆర్. డబ్లియు




షిచ్ఛవారగారు మాలో ఆరుగురు బాలురను సి. ఎం. హై స్కూలులో ఇంగ్లీషు విద్యాభ్యాసము చేయించుచున్నారు. వారిలో నేను ఒకడను. మా గురువులవారైన శ్రీ రెవరెండు. ఎస్. పాక్యనాథముగారు మాకు మన ప్రభువుని గురించి బోధించి మనమందరమునుకూడ దేవుని సువార్త వ్యాపకత్వము నిమిత్తము పాటుపడవలసినదనియును మనము దేవునిని ఎల్లప్పుడు స్తుతించుచుండ వలసినదనియును మాకు బోధించిరి. మరియు వారు మాకు అప్పుడప్పుడు భక్తికూటములను పెట్టి మే మందరమును మాకుమనస్సు పొందునట్లు చేసిరి. వారు మాకు ఈ బోధచేసినప్పటినుండి మా సూపరెంటెండెంటుగారైన ఆర్. సుదర్శనరావుగారును మేమును అనగా

ఇంగ్లీషు విద్యాభ్యాసము చేయుచున్న మేము ఆరుగురమును కలిసి బెజవాడకు సమీపమందున్న గ్రామాదులకు వెళ్లి మన రక్షకునిగూర్చి బోధించుచుంటిమి. మేము వెళ్లునప్పుడెల్ల మా బోధవినుటకు చాలామంది ఉల్లాసముగా వచ్చుచున్నారు.

కాబట్టి ప్రియమైన బాలమిత్రను చదువు బాలికా బాలురారా! మీరందరు మమ్మును గురించి దేవుని ప్రార్థించవలెనని మిమ్మును వేడుకొనుచున్నాను. మా దొరగారు (రెవ. ఆర్. డబ్లియు. పీర్సీ) మమ్మును బహుగా ప్రేమించుచున్నారు. మాకు కావలసినదంతయు యిచ్చి మమ్మును ఎప్పుడు సంతోషముగా నుంచుచున్నారు. ఇంతియకాక అన్నిటికంటే ఎక్కువగా మమ్మును ఇంగ్లీషు విద్యాభ్యాసము చేయించుచున్నారు. అందులకై వారికి మా నిండావందనములు చెల్లించుచున్నాము.

కనుక మీరందరును మాపలెనే దేవునిసువార్త ప్రకటింపవలెననియును, ఈ లోకములో ఆ పనిచేయుచున్నటువంటి మనతోటివారందరికిని దేవునిసహాయము ఎల్లప్పుడు తోడైయుండునట్లు మన పరమతండ్రిని ప్రార్థించవలసినదని మిమ్మును వేడుకొనుచున్నాను.

ఇట్లు సలాములతో మీ ప్రియబాలమిత్రుడు
కాకుపాటి జాన్ సుదర్శనము, బెజవాడ

C. L. S. PRESS, MADRAS—1918